నల్లకలువ

కత్తి పద్మారావు

లోకాయుత ప్రచురణలు : 41

ప్రథమ ముద్రణ, జూలై 1996.

ప్రతులు : 2000

**వెల : 20/-**

ముఖచిత్రం : అక్బర్ & కృష్ణ, పాల్వంచ

లేజర్ టైప్ సెట్టింగ్: అక్షరమాల, విజయవాడ

ప్రింటింగ్: భావన ఆఫ్‌సెట్ ప్రింటర్స్ (ప్రై) లి., విజయవాడ

ప్రతులకు:

కత్తి స్వర్ణకుమారి
లోకాయత ప్రచురణలు
లుంబినీవనం, పొన్నూరు - 522 124
Phone : 08643, 42840

మైత్రి బుక్ హౌస్, మసీదువీధి, విజయవాడ - 2

నవోదయ బుక్‌హౌస్, కాచీగూడ X రోడ్, హైదరాబాద్ - 27

విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, అన్ని బ్రాంచీలు

ప్రగతి బుక్‌హౌస్, మ్యూజియం రోడ్డు, విజయవాడ - 2.

నాలోని

సృజనకు, తత్వానికి, ఉద్యమానికి

మూలశక్తి

మా అమ్మకు

# నల్లకలువరేకులు

# కవిమాట

కవిత్వమంటే జీవితంలోనుంచి, ఉద్యమంలోనుంచి సామాజిక ఘర్షణలోనుంచి ప్రభవించే సృజనం. ఉద్యమకారుడి జీవితమే ఒక పాటలా సాగుతుంది. ఆ మధ్య బొంబాయిలో 'జాషువా జయంతి సభలో నేను మాట్లాడిన దాని మీద వ్యాఖ్యానిస్తూ, మరాఠి మహాకవి 'దయాపవార్' "నేనిప్పుడు లాంగ్ పోయమ్ విన్నాను' ' అన్నారు. ఈ మాటని బట్టి ఉద్యమ ఉపన్యాసాలన్నీ కవితలే, (అవి బ్రాహ్మణ వాదులకు తిట్లూ, శాపనార్థాలు).

ఈనాడు దళిత సాహిత్యయుగంగా జ్వలిస్తుంది. కారంచేడు రక్తపు మడుగుల నుంచి నీలి విప్లవం పుట్టింది. ఆ నీలి విప్లవం నుంచి నల్ల సూర్యుళ్ళు ఉదయిస్తున్నారు. ఈ సూర్యుళ్ళకు రాత్రి కూడా ప్రజ్వలించే స్వభావం ఉంది. మహాప్రస్థానాన్ని, మరోప్రస్థానాన్ని అధిగమించి, పంచమవేదాన్ని ప్రవచించిన 'సతీష్'లు, వర్తమానం గుండెలనుండి అగ్గిబాహుటాలు ఎగరేస్తున్న 'సుధాకర్'లు, దళితసాహితీ క్షేత్రంలో ఇనుపపాళీలు

మొలిపిస్తున్న 'శిఖామణులు', 'వెలివాడ'లో దళిత పలుకుబడిని కవితాగానం చేసిన 'నగేష్‌బాబు'లు. 'నిశాని'లు, వక్రోక్తితో దళిత సంగీతం వినిపించిన తెరేష్‌బాబులు ఇంకా ఎందరో సూర్యుళ్ళు. హిందూ శృతికి వ్యతిరేకంగా కలమెత్తిన 'ఖాదర్ మొహిద్దీన్, అఫ్సర్, ఖాజాలు, హిందూ స్మృతికి వ్యతిరేకంగా గళమెత్తిన దళిత స్త్రీవాద కవయిత్రులు 'గుండెడప్పు' మోగించిన కవులు, 'బహువచనం' ఆవిష్కరించిన బహుజన కవులు మొదలగు వారు దళితసాహితీ ఉద్యమానికి సంకేతాలు.

1979లో నేను 'జనగీతం' రాస్తున్న రోజుల్లో బ్రాహ్మణ నాయకత్వంలో విప్లవ సాహిత్యయుగం నడుస్తుంది. తెలుగు నేలలో ఆ ప్రభావానికి 'కడుపుతీపి' వంటి సామాజిక కవితలు రాయడం కష్టంగా ఉండేది. కారంచేడు పోరాటంలో విశాఖ జైలుగోడల మీద మసిబొగ్గులతో రాసిన గీతలు దళిత గుండెల్లో జైలుగంటలై మోగాయి. నిజానికి "జైలుగంటలు" దళితుల ఆత్మగౌరవ పోరాటంలో తొలికావ్యం అనవచ్చు. ఆ తరువాత వచ్చిన 'దేశం డైరీ'లో 'శవం మేల్కొంది' వంటి దళిత కవితలు ఈ సాహితీ యుగానికి బలం చేకూర్చాయి.

1988లో హైదరాబాద్‌లో జరిగిన 'అఖిల భారత దళిత రచయితల మహాసభ' ల్లో ఒక చారిత్రక క్రమంలో దళితుల చరిత్రను గేయరూపంలో వినిపించిన 'విముక్తిగీతం' దళిత మహాసభల్లో ఉద్యమ కవిత్వంగా ప్రచారంలోకి వచ్చింది. చుండూరు పోరాటంలో రాసిన 'రక్తక్షేత్రం' కవిత ఒక గతిలో ఉద్యమాన్ని అక్షరబద్ధం చేసిన చారిత్రిక గుర్తుగా మిగిలింది.

ఇక ఇప్పుడు మీరు చూడగలిగితే దళితుల జీవితాల్లో వెన్నెల వాగులున్నాయ్. వినగలిగితే దళితుల పలుకుబడిలో నిప్పు పాటలున్నాయ్. ఈదగలిగితే దళిత ఉద్యమంలో నెత్తుటి ఏరులున్నాయ్.

ఆకాశం నక్షత్రాలతో దళితుల చరిత్రను పాదుగుతున్న ఆలీసమ్మ ఒడిలోకి పోగలిగితేపొండి. అక్కడ 'నల్లకలువ' రేకుల్లో దళిత రాజ్యపునరుద్ధానం.

లుంబినీవనం — కత్తి పద్మా రావు
అంబేద్కర్‌కాలనీ, పొన్నూరు 5-7-96

# నల్లకలువ

నేను నల్లనిదానను
నా చెమట చినుకులతో
భూమిప్రియుడు పులకిస్తున్నాడు
నాగేటిచాళ్లలో నేను చల్లిన విత్తులు
నా పాదాల ఎరుపుతో మొలకెత్తుతున్నాయి

చిగురాకుల వంటి నా వ్రేళ్ళు
బాగ్యనగర్ నిర్మాణంలో రాళ్లయ్యాయి
నాస్తన్యం. గ్రోలిన బిడ్డడే
నన్ను చెంగుపట్టుకున్నప్పుడు
ఈదేశం గుండెల్లో దాగున్న రాచపుండు
నాకర్థమయింది

బ్రహ్మజెముడు చెట్టుకూడా
తన్నుతాను రక్షించుకోవటానికి
ముళ్ళకిరీటం ధరించింది
నారక్షణ వలయం నన్నే భక్షిస్తుంది

కాకి సామ్రాజ్యాధినేత అయిననాడు
కోకిల కూడా కాకినే అంటుంది
మనకి వర్ణభేదం లేదు స్వరభేదమేనంటుంది
పంచమస్వరం కూడా రసతరంగిణి అయినపుడు
చతుఃస్వరాలన్నీ పంచమంలోనే పలుకుతున్నాయి
కానీ నాస్వరాన్ని నేను గుర్తించగలను

ఈ భూమి సాక్షిగా నేను నల్లని దానను
భూమి కూడా నా నెత్తురు సాక్షిగా నల్లనిది
నేను నల్లనిదానను
నా స్వరం ఆదిమం

అన్ని వర్ణాలూ నలుపులోకి ప్రవహిస్తున్న ఈనాడు
మాతృత్వం నాదని గర్విస్తున్నాను



నేను ప్రాకృతికం
నన్నీసడించుకున్నకృతకాలాన్నీ
నాలో సంలీన మౌతున్నాయి
నెహ్రూకోటు ఎర్రగులాబీ రాలిపోతుంది
మా ఊరిమాదిగకుంటలోని
నల్లకలువకే పట్టాభిషేకం



గోదావరి ఒడ్డున
చింతచెట్టు కొమ్మకు
మాఅమ్మ నన్ను ఏలాడగట్టి
మట్టి మోస్తున్నపుడు
నా ఏడుపు విని వచ్చిన
కాకుల కేకలే
నా సంగీత పాఠాలు

నాగార్జున సాగర్
డామ్ నిర్మాణంలో
గోడకూలి
మా అయ్య చచ్చినపుడు

నాకు ధైర్యమిచ్చిన
కొండలే
నా నిబ్బరానికి గురువులు

పుల్లల కోసం
అడవి కెళ్ళిన మాయమ్మ
ముళ్ళపొదల్లో
ఇరుక్కున్నపుడు
కారిన నెత్తురే
నా కనుల్లో వున్న
వర్ణం

తూర్పు గోదావరి
కోతల కెళ్ళిన
మాయమ్మ
నేను స్టేషన్‌లో పెట్టిదించి
తమ్ముణ్ణి వదిలి
తిరిగి వచ్చేసరికి
రైలు పట్టాల మీద
తెగిపడటం
చూసిన
కళ్ళలో స్రవించిన
దుఃఖాగ్రహమే
నా రసశాస్త్రం

ట్రంకు రోడ్డుమీద
తారుపోసినపుడు
కాలిన తారులో
కాలు పెట్టిన నన్ను

చెప్పులు లేకుండ
లేవ నెత్తిన
నాతల్లి కేకే
నాగుండె నాదం

సముద్రంలో
వేట కెళ్ళిన
మా అన్న
తుఫాన్‌లో
ఇరుక్కున్నాడని
విని
ఒడ్డున వెతుక్కుంటూ
పోయినపుడు
భీమిలి
ఒడ్డున కనబడిన
దృశ్యమే
నాకళ్ళలో
వున్న శిల్పం

నల్లకాకి
నల్ల కొండ
నల్లతారు
నల్ల సముద్రం
నా సంకేతాలు

నల్లరాజ్యం వైపు
నా ప్రయాణం.

7 అక్టోబర్ 1995



# భాగ్మతి

నగరాల గుండెల్లో కూలుతున్న గుడిసెలు
నగరానికి హృదయం లేదు
నేను భాగ్మతిని

నా కాయం యశఃకాయానికి
ఆయువు పోసింది
తటాకాల వంటి నా నేత్రాలలో
దుర్గంధ జలం ప్రవహిస్తూ వుంది

నేను నల్లరాళ్ళలో సెలయేరుగా ప్రవహించాను
నేను షా కిరీటంలో   కలికితురాయిగా వెలుగొందాను
నేను చరిత్రను
రామదాసు పాటలోని
సీత నన్ను వెక్కిరించింది

నేను ధరిత్రిని
మొఘల్ పాదుషా తురంగం
నా అంతరంగం పై కవాతు చేసింది
నేను కవయిత్రిని
విలాసీనది తరంగ రంగాలలో
నేను నినదిస్తూనే వున్నాను.

నేను శ్రమరమను
గొర్రెల కాపరి చెమట బిందువులలో
నేను మెరుస్తున్నాను

నేను జలధునిని
సాగరం గుండెల్లో జ్వలిస్తూనే వున్నాను

నేను భాగ్య నగరానికి
అంతరంగాన్ని
భాగ్యనగరం గుండెల్లో
నేను జనిస్తూనే వున్నాను

నా మరణం ఒక రణం
నా మృతిలో అమృతత్వం వుంది
చూడగలిగితే
నిస్తేజంగా హుస్సేన్ సాగర్‌లో నిలబడివున్న
బుద్ధుడి గుండెల్లో నేను ఉన్నాను
నేను భాగ్‌మతిని

ఆగస్టు - 1995



# నల్లకేతనం

నిప్పుసొగసు
తన్నుతాను దగ్ధం చేసుకోగల
సామర్థ్యంలో విప్పారింది
సూర్యుడు రోజూ చస్తున్న చోటే పుడుతున్నాడు
క్షతమైనదంతా చరిత్రని

బూడిదలో గీసిన గీతల్ని
తవ్వి పట్టుకుంటున్నాడు
పుర్రెలోని ఎముకల పేటికలో
శిల్పాన్ని దృశించిన శిల్పికనుగుడ్లు
రామాలయ గోపురంలో దొరికాయి....
పచ్చిపొదల్లో మంటలు మండటం చూసి
రుతు క్రమం మారిందని
గొర్రెల కాపరి చెప్పాడు
గొర్రెబొచ్చు నిక్కబొడిచిందని
కటికోడు కత్తిపారేసి
ధర్మం మారిందని
పురోహితుడికి ఫిర్యాదు చేశాడు
చీకటికి వెలుగుకంటే సౌందర్యం ఉందని
గుడ్లవ్వ కిన్నెర గీతం పాడింది
తెల్లపిల్లి విధవ సంకేతమని
నల్లపిల్లి శకునానికి ఎగబడుతున్నారు
నల్లమబ్బు తునకల్లో
నీటిబుగ్గ ఉందని
సముద్రమ్మ అల ఒకటి
కాకితో చెప్పింది
నల్ల భూముల పైన
తెల్లజాతి తెగుళ్ళను
తరిమేద్దామని
ఆఫ్రికా ఖండంలో
రింగురింగుల తల
జెండాగా ఎగిరింది



# దళితమ్మ

పోలేరమ్మ జాతరలో గొర్రెతల తెగింది
అంపశయ్యమీద
భీష్ముడి గొంతు తడారినపుడు
లాక్షాగృహంలో దళితస్త్రీ నవ్వింది

దండకారణ్యం మంటల్లో
కురుత్రయం మసైనపుడు
లాక్షా గృహంలో పంచపుత్రుల స్మృతిలో
దళిత తల్లి నవ్వింది

హస్తినాపురిలో ధర్మజుడు
కర్ణుడికి పెట్టిన పిండం
ఏదళిత సూరయ్యకు చేరిందోనని
లాక్షా గృహంలో దళితస్త్రీ నవ్వింది

హస్తినాపుర వీధుల్లో
కుంతి భుజాల మీద సగంకాలిన శవాలు

పట్టమహిషికీ, పంచముడికీ వున్న
సంబంధాన్ని చూసి
లాక్షా గృహంలో దళితస్త్రీ నవ్వింది

కలువరి గిరి పై సూర్యుణ్ని శిలువేసిన
హేరోదుని చూసి
మరియమ్మ కన్నీటిలో
సూర్యబింబ పునరుత్థానమని
లాక్షా గృహంలో దళితస్త్రీ నవ్వింద

కంచిక చర్లలో కోటేశు
హిమాలయాలకి నిప్పంటించాడని
మూసీనది ఒడ్డున
తండ్రి తలనరికిన కొడుకుకు
పట్టాభిషేకం జరిగిందని
కారంచేడు పొలాల్లో
హేరోదు నరికిన
మోషేతల చెప్పింది

దగ్ధమైనదంతా ధరిత్రవుతుందని
ఆకాశంలో ఆలీసమ్మ
నక్షత్రాలతో
చరిత్రను పొదిగింది

(లక్క ఇంటిలో కుంతికి పాండవులకు బదులుగా
ఒక దళితస్త్రీ ఐదుగురు కుమారులతో
దగ్ధం చేయబడింది, ఆమే ఈమె)

# జైభీమ్

నాపాదాల్లో
అరుణ కిరణాలున్నాయని
నేడు నమస్కరిస్తున్న
చేతులు
నేను చిన్నప్పుడు
మంచినీళ్ళడిగితే
అస్పృశ్యమన్నాయి

నేడు నాముఖంలో
అరుంధతీ
నక్షత్రాన్ని వెదుకుతున్న
ఈ కళ్ళు
నన్ను చూస్తే పాపమని
గుడ్డి వయ్యాయి



నేను నడిస్తే
నా వెనుక పరిగెడుతున్నపుడుకానీ
నానాడకను
వీళ్ళపరుగు

అందుకోలేదని
వారికి తెలియలేదు

నా సింహాసనంలో
'హాసం' చూస్తున్న వీళ్ళు
సింహ 'హాస' భాష్యాన్ని వల్లిస్తున్నారు

మా చేతుల్లో వున్న
అమృత భాండాన్ని
ఏ 'మోహినీ' యో
వచ్చి ఎత్తుకు పొద్దనే
మా అన్నలు నన్ను నిలబెట్టారు

'మాయ'ను మాయ చేయలేమని
మోహిని నిజరూపం ధరించింది
సూర్యోదయ మయ్యాక
నమస్కరించడమే మనపని
అని ఒక గోమాత
'గోమతి' ఒడ్డున
తలవంచింది
'జైభీమ్' పలకందే
సూర్యకిరణాలు సోకవని
ఒక 'నంది' మెడలో
గంట మ్రోగింది

-(లక్నోలో BSP మంత్రి మండలి ప్రమాణస్వీకారం చూశాక.
26-6-1995)

# ఆమె ప్రకృతి

నవయవ్వనంలోనే
చిరిగిన వంటితో
రక్తాకాశాన్ని నిర్మిస్తున్నది
ఎవరు యీమె? !

కురులు విరబోస్తే
వరులు నదులు దాటారని విన్నాను
నఖ నక్షత్రాలతో విశ్వాంతరాళాలను
భూతలంమీద నిర్మించిందని చెప్పారు
తన పాదాల వెంట
సామ్రాజ్యాలను నడిపించిన ఆమె
ఇపుడు సంక్షుభిత కాసారంలా శుష్కమవుతున్నది
నరక కూపాలను గుండెల్లో దాచుకొని గమిస్తూ
నఖక్షతాలతో ఎర్రబడ్డ కాశ్మీరమయ్యింది
ఎవరు యీమె?



కనుకొలకుల్లో గొల్ల కొండలు
పరిభ్రమించాయని పాడారు

తోడేలు చీల్చిన గొఱ్ఱెలా కొండకోనపై
వేలాడుతున్నదేంటి?

వెదురు బొంగు యీలతో
శృతి కలిపిందని విన్నాను
ఖండాంతరాంతరాళ నల్ల సంద్రాల ఝుంఝుంను
మోసుకొస్తున్నదేంటి?

పాదనర్తనతో పంచభూతాలను
నడిపించిందని విన్నాను
నేడు కాటిసీమ జానెడు నేలనివ్వ నిరాకరిస్తుందంటే
ఈమె ఈదేశానికి మూలమా?
ఈ దేశం ఈమెకు మూలమా?

నికారకరించిన కవులే
ఆమెను అందుకోలేక
నీడల జాడలలో నిరక్షరాలు పొదుగుతున్నారు
ఆమె గుంపుగా నున్నపుడు
కవి వ్యక్తిగా
ఆమె దేశమైనప్పుడు కవిగుంపుగా
ఆమె ఖండమైనప్పుడు కవిదేశంగా
ఆమె ప్రాకృతికమైనప్పుడు కవి వైయక్తికంగా
అందనంత ఎత్తుగా ఆమె ఎదిగిపోతున్నది.

అమెలోనే నిండిపోవాలని
అమె (ఒడి)లోనే ఒదిగి పోవాలని ఆరాటం
ఆమె రాజ్యమని అందుకోబోయాను
కానీ, ఆమె ప్రకృతి.



# గోదారి

ప్రకృతి వికృతిగా
మరిందాక
మనిషికి తన బరువు
తెలియదు

ఆకాశం
తన్నుతాను
భూమిమీద
పరుచుకున్నాక
భూధరులంతా
జోలెపడుతున్నారు

విశ్వంలో
ఎత్తు అనేది లేదని
అంతా సాపేక్షికమే అని
పడిపోయిన
మంత్రి కళ్ళ ముందు
భూమి తిరిగింది
కాళ్ళ క్రింద వున్న ప్రతిదీ
తలపైకి వస్తుందని
బూడిదను
గంగలో కలిపినా
భూమికే చేరుతుందని
గోదారిలో
కాణీ విసిరేసిన మామ్మకి
పెట్టిపోయి
తిరుపతి మెట్ల మీదకి
చేరినపుడు కానీ
తెలియలేదు

తిరిగిచూసుకోవడం
సింహానికే కాదు
సింహాసనానికి కూడ తప్పదు
కాలంగాయంలో గేయం
నిజమౌతుందని
పొంగుతున్న గోదారి
ఊలపాట పాడింది
(తుపాను తర్వాత)

22-10-95



# యుగధర్మం

గంగ గుండెల్లో
నిజం శవం
తేలింది
చక్రవర్తి విందులో
వధించిన
గోరక్తంతో
'చర్మన్' మతిగా
ప్రవహిస్తుంది
త్రివేణి సుడిగుండంలో

ధర్మం వధ
జరిగింది
పెరియార్
వింధ్య దాటాడని విని
అయోధ్య రాముడు
ఐరోపాకి పరుగు తీశాడు
చరిత్ర సూర్యుడు
భిల్లుడి కళ్ళలో
కిరణమయ్యాడు
యమునలో
బుద్ధ ధ్వజం
లేచింది
చీనాలో
స్త్రీల కేకకు
లేచిన సీత
తన్ను మంటల్లో
తోసిన రాముడు
హంతకుడని సాక్ష్యం చెప్పింది
యుగధర్మం
మారిందని
ఆసియా
అంచుల్లో
తధాగతం
రుతించింది

-లక్నో 19-9-95



# నీలోనేను

నేను మనువును
మానవత్వం నా శత్రువు
నన్ను వెలివేయాలనే
అవర్ణుల కుట్ర
వెలిని నేర్పింది నేను
దానికి నేనే బలయ్యేట్లున్నాను
నేను వ్యక్తినిగాను
వాదాన్ని
వెలివాడలో
మాల మాదిగ గొడవల్లో
నేనున్నాను
కారంచేడు ఖడ్గానికి

నేనంచును
నేను
విడదీసిన వన్నీ కలిసి
నా మీద దాడిచేస్తున్నాయి
నేను
మానవత్వ దహనానికి
కాటి కాపరిని
మనుషులు బ్రతకాలనే ప్రయత్నం
నాకు ప్రాణహాని అయ్యింది
నేను కుల సమాజానికి
ఆయువును
నాగొంతు నులమాలని
దళితవాదం కేకలేస్తున్నది
నేను ఆకలిని సహిస్తాను కానీ
అవర్ణాన్ని సహించను
నేనిపుడు
రూపం మార్చుకున్నాను
నాజీవనం
బ్రాహ్మణ వాడల్లో కాదు
మాలోడి కొమ్ము బూరలో
మాదిగోడి డప్పులో
నేనిప్పుడున్నాను
ఈ రెండింటికి
శ్రుతి లయను తప్పించటం నాపని
బొంబాయి నడిబొడ్డులో
హతుడైన పకీరు రక్తం నుండే

నా రాజ్యం ఆవిర్భవించింది
నన్ను ద్వేషించాలని
త్రిపురనేని ప్రయత్నించి
నాలో జీర్ణమయ్యాడు
నేను
బుద్ధుణ్నే మింగగలిగిన ప్రవరుణ్ని
నేను ఎర్ర తోలు కప్పుకుని
మార్క్సును కులంలో కలిపిన డాంగేని
నేను
విశాఖ సముద్రం ఒడ్డున
కవిత్వం నల్లమందు నమ్ముకొన్న మహాకవిని
నేను లంకపై దండెత్తిన
ఆంజనేయుణ్ని
నారూపాలనంతం
నేను అన్ని ఇజాల్లో అంతర్భవించి
ధ్వంసించి పునర్జీవిస్తుంటాను
దళితవాదాన్ని
దళిత వేదం చేయాలని
చెప్పులదండ సంస్కృతి
టాంక్‌బండ్‌పై ప్రారంభించాను
నేను మనువును
మానవత్వం నా శత్రువు
నేనునీలో వున్నాను
నీవు నన్ను గుర్తిస్తే నేను నశిస్తా
నన్ను బ్రాహ్మణిడిగా ద్వేషిస్తే
నీదీ బ్రాహ్మణవాదమే
నా మూలం హైందవం
దాన్ని కూలిస్తే నేను మరణిస్తా



# చాకిలి తీరుడు

యనభైకోట్ల భారతీయుల
పురిటి నెత్తురు పిండి
మైలను పోగొట్టి
మనిషిని రూపొందించే పనిలో
అమ్మని మరిపించినోడు
మలమూత్రాలతో

మకిల బట్టిన బట్టలుతికి
అమ్మ తనానికి ఆయువు పోసినోడు

చౌడు మట్టిని
సున్నపు గడ్డని
కలిపిన 'కమ్ము" తో
గుడ్డలుడ కేసి
మురికిని పిండిన
రసాయన శాస్త్రజ్ఞుడు

చిన్న చిన్న మడుగుల్లో
పారుడు నీళ్లల్లో
ఎండకు ఎండుతూ
వానకు తడుస్తూ
బట్టకు వన్నె తెచ్చి
జాతి మన్నన పెంచిన
మహా మనిషి అతడు

సంవత్సరానికి కొకతూరి
తూమెడు గింజలు కొలిస్తే
కుటుంబానికంతా
నిస్వార్థంగా
చాకిరి చేసే
అవిశ్రాంత శ్రామికుడు

పెండ్లికి కబురు చెప్పేటోడు
ఇంటికి వెల్లవేసేటోడు

దివిటి పట్టేటోడు
పల్లకి మోసేటోడు

సమర్తయినా, పెండ్లయినా
పురుడైనా, చావైనా
మొత్తం మురికిని పిండి
ఆరేసే అగ్రజుడు
కూలి కొలత లేనోడు
తల్లి, చెల్లి
తండ్రి, తమ్ముడు
అందరూ కలిసి
చాకిరేవు దగ్గర
ఉడికి పోతూ
ఉడకేసి,
ఉతికి ఆరేసి
ప్రొద్దుగుంకాక
భూకామందు ఇంటికి
బట్టలు చేరేసి
మట్టిమరక పోలేదని
నలిగి చిరిగి పోయిందని
చీర మడతలోనో
చొక్కా జేబులోనో
ఉన్న సొమ్ము పోయిందని
చీవాట్లు, చీదరింపులు
అదిరింపులు, బెదిరింపులు
మోసుకొచ్చుకుని
హత్యకో. ఆత్మహత్యకో
బలి అయ్యే బడుగు జాతి

సంధ్యకాంతుల్లో
గుడ్డలు మడతేసి
చీకటి పొరల్లో
అఘాయిత్యానికి గురైన
చెల్లెలి ఆక్రందనను
గుండెల్లో దాచుకునే
నిస్సహాయ, నిర్భాగ్యుడు
పాసిన కూటికోసం
నిలువెల్ల చాకిరీ చేసి
కృతఘ్నుల సేవలో
మగ్గి బుగ్గై
జీవన సంస్కృతంతా
గుల్ల జేసుకున్నోడు
వాడే ----- వాడే
చాకిరీ వీరుడు
గుండెలు బండలుగా
బానిసత్వం చేస్తున్న
శ్రమశక్తి
మానవ ఆరోగ్య
ప్రదాత
మనందరి మేల్గోరు
రజకుడు

చాకిరీ వీరుణ్ని
చాకలోడన్నారు
మానవతా ధీరుణ్ని
మడేలోడన్నారు
సంస్కారహీనులు
సామాజిక ద్రోహులు

చేతిపని వాడికి
గోతులు త్రవ్విన భూమిలో
నైపుణ్యానికి
హీనత్వం అంటగట్టిన నేలలో
భూమి వారసులు
తిరగబడక మానరు
బండకు పడేసి
ఉతక్కమానరు

సంఘానికి పట్టిన
పెను మురికిని
శాస్త్రీయంగా తీసేసి
మనిషిని మనిషిని చేసే
సంఘ సంస్కృతిని
బ్రతికించే సంస్కారులు
సంఘ విజయానికి
మూలశక్తులవుతారు.
నిస్సత్తువ, నిర్వీర్యం
అంతరించి పోతాయి
ఈ దేశం నాదనే
ఈ గ్రామం నాదనే
పీడిత జాతి సమైక్యతా నినాదం
విజయం పొంది తీరుతుంది

సమతారాజ్యంలో
అందరిదీ సమ భాగమే
ఆనాటినుండి సూర్యుడికి
అస్తమయం లేదోయి

25-3-1989



# నాకౌట్

నిన్న పచ్చగా వున్న కంకి
ఇవాళ తెల్లబడింది
ఏతాం తాడు తెగిన బొక్కెన
రాళ్ళల్లో పడింది
మొక్కజొన్న కండె కోసం వచ్చిన

గువ్వకు చుక్కెదురయ్యింది
భూమి నెర్రెలో ఇరుక్కున్న
కాలు రాకపోగా
కుండ పగిలి నీళ్ళు
భూమి దాహం తీర్చాయి

కాలులో విరిగిన ముల్లు
పీకినా రక్తం రానందుకు
కళ్ళు గాజు పెంకులయ్యాయి
ఉగ్గిగిన్నెలో ఆముదం
ఎండిపోయింది
పుట్టిన బిడ్డకు
ఆకాశం కనిపించక
'చందమామ రావే' పాటను
'రేచీకటి' వెక్కిరించింది
జోలపాట వినబడని
బిడ్డకివ్వాల్సిన పాలడబ్బా ఖర్చు
'న్యూట్రిషన్' అడ్వర్‌టైజ్‌మెంట్ కయిందని
పార్లమెంటులో
మూల్గిందో ముసలి నక్క

వికలాంగుల
జననాలు
కర్మభూమిలో
కలియుగధర్మమని
యు.యన్.ఓ సమావేశంలో
ధ్వనించిందొక జండెం

అన్ని విటమినులున్నవాణ్ని
ఆస్తికోసం
కడుపులోనే చంపమని
గాట్ సందేశం అందింది
మాలకుంటలో నీళ్ళ
తీపి పోలేదని
ఎండాకాలం సూర్యుడు
దాని ఒడ్డుకు చేరాడు
సూర్యుణ్ని వెతుక్కుంటూ
గ్రహాలన్నీ ప్రయాణమయ్యాయి

మాలవాడలోని
తల్లి జోలపాటకు
సూర్యుడు మండుతున్నాడని
రాష్ట్రపతి భవనంలోని
రాచపిట్ట కూసింది
సూర్యుణ్ని ఆర్పటం
ప్రతిభారతీయుని కర్తవ్యమని
పార్లమెంటులో బిల్లు పాసయ్యింది

బిల్లులకు బెల్లులకు
సూర్యుడారి పోడని
ఒక నల్ల బిడ్డ అరచుకుంటూ
వాకౌట్ చేశాడు.

# నాగలోకం

అశోకుని స్థూపంపై
ఆడసింహం
పూరీ క్షేత్రంలో
పులి చర్మం
ఏడుకొండల
స్థన కుంభంలో
ఎరుకలసాని

అమరావతి బౌద్ధ చక్రంలో
అరుంధతీయుని
చెప్పులు
నాగార్జున గుహల గుండెల్లో
ఉలిపట్టిన కపిలుడు
ఎల్లోరా కుడ్యాలపై
నర్తించిన
మాతంగులు



అజంతా చరియల్లో
మత్తేభ మదజలం
సింధూలోయ చిహ్నాల్లో
దళిత తల్లి శిల్పం
తెగిపడ్డ శిరస్సులు
పలవరిస్తున్న చరితలు
నాగస్వరం ఊదితే
నాగలోక దృశ్యం
నాగలోక దృశ్యం

-- 18-12-1995



# స్వాగతం

చలి కబళించిన
కళేబరం
గని ప్రసవించిన
నల్లశిశువు
మురుగు కాలువలో
చిదిమేసిన పరిమళం
నాగలి కర్రులో
దిగబడిన పుర్రె
ఢిల్లీ నడిబొడ్డులో
ఆవు మేస్తున్న
పిండం
పలుకుతున్న స్వాగతం
నూతన వత్సరానికి
స్వాగతం

- 18-12-95



# నల్లవాగు

సూర్యబింబాన్ని తొక్కుకుంటూ వెళ్ళే

నా తల్లిపాదం

దారి పొడుగునా

రక్తాక్షరాలు నిర్మిస్తున్నది

వేసే ప్రతి అడుగులో

ఏ బిడ్డడి ఎక్కిళ్ళు ధ్వనిస్తున్నాయో!

కళ్ళలో స్రవిస్తున్న ముళ్ళకిరీటం

నల్లవాగును
ఒక్కయీతలో దాటుతున్న
మత్స్యావతారం
గుడిసెలో చప్పున
గుండెకద్దుకున్న బిడ్డడి పాల గుటక
పాదాల నుండి కారిన
రక్తస్రవంతుల్ని ఓదార్చుతుంటే
ఆ తల్లి గుండె బాధనంతా మర్చిపోయింది
'రావే చందమామా' అంటే
రాడానికి సాహసించని ఏ గ్రహానికీ
ఇంత నిగ్రహం లేదేమో

పిల్లోడు పాలు తాగాక
విరిగిందని గుర్తొచ్చిన ఈతముల్లు
తాటకి వెన్నులో దిగిన
ఆర్యబాణం

నల్లబొగ్గుగనిలోంచి
చీకటి సముద్రంలా వచ్చిన
తల్లికూడా
ఇచ్చేది తెల్లని పాలేనన్న సత్యాన్ని
విమానం కూలినపుడు
'అమ్మా' అని అరిచిన రాకుమారుడి కేక చెవులోంచి
ప్రకృతంతా దళిత తల్లితో తులతూగలేక
వికృతిగా మారినా
తల్లి శబ్దం తల్లే

చుక్క పొడిచినప్పుడు
బిడ్డనోట్లోంచి రొమ్ముల్లాగి
పచ్చాకు కొచ్చిన అమ్మ
పిల్లాడు గుర్తుకొచ్చి
బొరస్ మంటలో చెయ్యిపెట్టినప్పుడు
హిరోషిమా బాంబుమోత
ఓడిపోయిందని
తల్లి గుండె చెబుతుంది

రెండు చేతులూ చాచి
సమాధి పెట్టెలో ఊరేగిన
అలెగ్జాండర్ కూడా
తల్లితనం లేకనే చచ్చాడు
బిడ్డ అరుపు విని
ట్రంకురోడ్డు మీద అడ్డం వచ్చిన లారీలు
సందు సందులనుండీ
ఆమె పరుగు నడక తీస్తుంటే
సూర్యుడు కూడా జడిసి
ఒక అడుగు వెనక్కేసాడు
ఇంకా నేలలో అమ్మతనం మిగిలుంది కాబట్టే
నాలుగు గింజలు అందుతున్నాయని
నల్లబారిన చేలో
ఒక గువ్వపిట్ట చెప్పింది.



# ఆత్మవిమర్శ

నేను
దూదేకులు ఏకిన
పత్తి పింజెరం నుండి
రూపొందిన పోగును
మనిషి శ్రమనుండి
ఉద్భవించిన నేను
మనిషి మనిషిని
వేరు చేశాను

యజ్ఞోపవీతం
పేరుతో
ద్విజన్మను
సృష్టించి
యాచకవృత్తికి
నన్ను సంకేతం చేసారు

నాకు జంధ్యమని
పేరుపెట్టి
ఇళ్ళపేర్లుగా కూడా
పెట్టుకొని
'వూ'లు దారాలతో'
మనుషుల గొంతులు బిగించి
పూల ఉరి గురించి
బావురుమని
'కరుణశ్రీ' బిరుదులు
కొట్టేసారు
అ,ఆలు రాని
నిరక్షరాసి కూడా
నన్ను ధరించి
పంతులుగా పిలవబడుతుంటే
నిజమైన గురువు

మాల మాష్టార్ అయ్యాడు
నన్ను అడ్డం పెట్టుకొని
'అమ్మ'ను కూడా
అస్పృశ్యురాలిని చేసి
క్లబ్బుల్లో
బారుల్లో
సరదాలు తీర్చుకొంటున్న
పంతులుగారు
నా సాక్షిగా
మునుసబు గారు
వదిలిన బ్రాంది తాగి

'ఓం నమశ్శివాయ'
అని ఉద్రేకం తెచ్చుకొని
రాములమ్మ జాకెట్
చించేసాడు
ఉదయాన్నే పూజలో
'కృష్ణార్పణం' అని
పాపాలన్నింటిని
కృష్ణుడికి అప్పజెప్పి
'స్వాహా' మంత్రంతో
దేశం మీద పడుతున్నాడు
నన్ను తెంచేస్తే
జనం అంతా కలిసిపోతారని
'నాయీ' 'నయా'
నామాలతో
జందేల స్వాముల్ని
పెంచేసాడు
మానవత్వాన్ని
హత్య చేస్తున్న
ముద్దాయిగా
నన్ను
అంబేడ్కర్ గుర్తిస్తే
ఆయన గొంతుకు
నన్ను ముడేసి
బిగించారు
కృష్ణదేవరాయల కొడుకును
తిమ్మరుసు చంపి
నన్ను ధరించి నోడికి

కృతజ్ఞత ఉండదని
దండోరా వేసాడు
రాముడి చేత
వాలిని చంపించి
జనమే జయుడి చేత
నాగుల్ని చంపించి

నన్ను నేను రక్షించుకోవడానికి
ఎంత నెత్తురు తాగానో
చరిత్ర నన్ను నిలదీస్తే
నా శాఖాహారం మాటున
నరబలి ఉందని నేను
అంగీకరిస్తే
మాదిగ గూడెంలో
సజీవంగా
మరణించి నోళ్ళందరినీ
నేను గొంతు నులిమానని
ఒప్పుకుంటే
ఏకలవ్యుడి వేలు
ఎవరికోసం
ద్రోణాచార్యుడు నరికాడో
వాడే.....
సాక్ష్యం మిగలకూడదని

ద్రోణాచార్యుణ్ని వధిస్తే
ప్రత్యక్షంగా చూసిన నేను

అప్పుడే
ఆత్మవిమర్శ
చేసుకుందామనుకున్నాను
అంతలో
ద్రౌపది సంతానాన్ని
అశ్వత్థామ హతమార్చినపుడు
పోగు ధరించినోడి
పేగులో ఎంత విషముందని
ద్రౌపది అన్నపుడు కూడా నేను
శిశుహత్యకు కూడా వెనుకాడడం లేదని
వెను దిరిగి చూసుకోలేదు
నన్ను నేను ఆత్మవిమర్శ చేసుకొంటే
నామీద ఆధారపడి
కోటిమంది జనమున్నారు
వారు పనిపాటా లేకుండా
పరాన్న భుక్కులుగా
నామీద జీవిస్తున్నారు

నేను ఇప్పుడు
వారినుండి దూరమైతే
వారికే వృత్తి లేదు
'శ్రమహీనుల్ని' నేను రక్షించాలి
నావల్ల హీనుడవుతున్నవాడు
ధైర్యంచేసి నన్ను తెంచేస్తే కాని
నాకు ముక్తి లేదు
నా మరణమే
నాకు విముక్తి....



# ఒడిబడి

కాసిన్ని గంజితాగి
కూసింతసేపు కుక్కిమంచంలో ఒత్తిగిలినపుడు
మాతాత ఒళ్ళోకెళితే
ఎన్నెన్ని కథలో !
ఆకాశం కేసి చూసి

మాతాత మాటల పుట్టయ్యేవాడు
నచ్చత్రాలు చూస్తూ
నాగలోకం కథలు చెప్పాడు
తాత ఒళ్ళో కూర్చుంటే
చదువెట్టా వత్తాదని
మా అయ్య
నన్ను ఉతికి
అయ్యోరి దగ్గరికి తరిమితే
ఆయన చేతిలో బెత్తం నోట్లో తిట్లు
పుస్తకం జూసి పాఠాలు చెప్పే
అయ్యోరికి ఒకటే అరుపులు కరుపులు
మా తాత
సూడకుండే పాఠాలన్ని సెబుతాడు
మా తాత ఎపుడూ తల నిమిరితే
పంతులెపుడూ వాతలేస్తాడు
మాతాతకున్న ప్రేమ
ఈ పంతులుకుంటే
మా అన్నోళ్ళెందరో
ఒడంటే ఇష్టపడి
బడంటే భయపడే వాళ్ళుకాదు
పంతులికి గొంతుంటే
తాతకి గుండె వుంది
పంతులు కుర్చీలో పెత్తనం
తాత ఒడిలో అమ్మతనం
ఆకలవడం
ఆకాశంవైపు చూడ్డం రానోడికి
మన కథ అర్థం కాదని
మాతాత పోతూ పోతూ చెప్పాడు

# గ్రీటింగ్

గవ్వ కళ్ళల్లో
పగిలిన గాజు పెంకులు

తలనిండా
పల్లేరు ముళ్ళు

రేగు పండులా
పుండు బడ్డ అంగిలి



అంబలి ఇంకని
ఎండిన పేగులు

ఏకలవ్యుని విల్లులా
వంగిన వెన్ను

ప్రపంచ పటంలా
పగిలిన పాదం

మా అవ్వ
21 వ శతాబ్దికి
మానవ హక్కుల సంఘానికి
పంపుతున్న గ్రీటింగ్.

-- 1-1-96



# సంకేతం

నీ కలం
సిరా చుక్కల నుండి
కారే కన్నీళ్ళు
నన్ను కరిగించలేవు
నా వేదనను వేదనాదం
చేద్దామని
సోమయాజులు
అంబేద్కర్ వేషం వేస్తున్నాడు

కానీ
ఆయన కళ్ళలో దాగిన
అగ్నిహోత్రాన్ని
నేను గుర్తుపట్టాను
శిలువ ఆకాశం అంత ఎత్తు ఎదిగినాక
హేరోదు కూడా శిలువ మీదకు
పాకాలని చూస్తాడు
బంగారు మేకులు
చేతుల్లో దిగకపోయాక
మర్లా దిగి వస్తాడు
వేమనకు
అంబరాలు తీసేస్తే
దిగంతాలకు పరుచుకున్నాడు.
ప్రకృతిలో భాగమైనోణ్ణి
ఏం చేద్దామన్నా నిజం ఔతున్నాడు
కరక్కాయలు నమిలిన గొంతుక
కాకినాదం చేయాలని
ఉబలాటపడుతుంది.
'ఓం' కారం చెదరి
'కాకి' స్వరంలో చేరి
కా, కీ, కూ, కమ్ అయింది
స్వర శాస్త్రవేత్తలు
కాకి భాష్యం చెప్పటానికి
బయలుదేరారు
వీణలు తంబురలైతే
జోలెలు నిండుతాయని
విశ్వవిద్యాలయాల
సిండికేటులో
ఒక జ్యోతిష్కుడు చెప్పాడు
అన్ని యుగాలకు నేనే సంకేతాన్ని
అని కాకి నలుపు
సవాలు విసిరింది.



# తెర చిరిగింది

నిశరేత్రి ముళ్ళపొదల్ని
దున్నుకొంటూ
ఏడిసెనక్కాయలుండలు
సెంగులో కట్టుకొని
ఆకాశపు అంచులకు
నీకోసం

నడిచొస్తున్నపుడు
గుండెకు తగిలిన
అవిసె గుత్తులు
మోకాళ్ళను చుట్టిన
ఉమ్మెత్తలు
పాదాల్లో ముళ్ళగోరింటాకు
ఎఱ్రమందారాలు
ఇసుక దిబ్బల్ని
ఈది
సముద్రపు ఒడ్డుకు నేను
చేరితే
కడలి పెనుసుడిలో
నీవు చుట్టుకొన్నావన్న వార్త
అలలు మోసుకొచ్చినపుడు
గుండెల్లో రేగిన
పెను తుఫాను
కళ్ళల్లో బడబానలం
సముద్రం జడలు విచ్చుకున్న
వికటాట్టహాసం
సుఖానికి దుఃఖానికి
తీరం తెర చిరిగింది
కడుపులో పేగు
దిక్సూచిలా కదిలింది.

- 26-12-1995

# మాలకాకి

పిల్లల్ని
నములుతున్న తల్లులు

సౌందర్యాన్ని
కాలరాస్తున్న కండలు
హృదయాన్ని గాయపరుస్తున్న
అక్షరాలు

ఆకలిని చిలుకుతున్న
వర్ణాలు

అమరాన్ని వల్లిస్తున్న
నోళ్ళు



ఆకాశాన్ని చూడలేని కళ్ళు
మనువు అంగాంగాలు

నాగులకోట కొమ్మకు
వేళ్లాడిన మనువు తల

చిటారున రాజసంగా
మాలకాకి
ఈ యుగ సంకేతం



# అయ్యమాట

ఇసికె పఱ్ఱలో
ఏడిశనక్కాయల కోతకు
రెండు కోసులు నడిసి
పీకిన కొద్దీ
సూరిగాడు ఎదురునడుస్తున్నాడు
చేతులన్నీ
గుంజకపోయే
దొరువులో పసిగిరి నీళ్ళకు
కడుపులో ఇసకటం
పుట్టింది
మద్దేల బువ్వలో
రొయ్యలకారం మంట
గణిసెగడ్డ నమిలితే గాని పోలే
వానొచ్చినప్పుడు

మా బుడ్డోడు
ఇంటి కన్నాల కింద పళ్ళేల
ఆటాడతాడు
తుఫానొచ్చినపుడు
పాదిరిగారిచ్చిన బొంత
చిరుగులో కాలుబెట్టి
బోలెడు కంత జేసేదాక ఆడు నిద్రబోలే
ఆడికి సొక్కా కొందామని
మొన్న పడమటిపాలం
మట్టిపనికి బోతే
కాల్లో పాలుగు దిగబడే

మనవడు కలకలేటరవుతుడని
మా అయ్యవాణ్ణి మెడదించడు

మా ఊరి కరణం
కొడుకు దగ్గరికి
పట్నమెల్లి చస్తే

అక్కడ మోసేవాళ్ళు లేక
మా వూరికిబుడ్డకారులో
ఏసుకొచ్చారు

'ఈడిబొందబడ
కాటికీడ్చటానికి
నలుగురైనా లేకుండా
సేసుకున్నోడిది
ఎంత పెద్దకులమైనా ఏం లాభం ?
అని మా అయ్య
కాటికాడికెల్తా
కర్ర మెడమీదేసుకున్నాడు -12-2-96



# బతుకంటే

కళ్ళల్లో
నీరుకాసులు
కల్లంలో
ఎన్నిసార్లు ఊడ్చినా
మట్టిపెళ్ళలేకాని
వడ్లు గింజలేదు
ఈ కల్లం ఇస్తారని
నాలుగు బస్తాలు
మినుంలు ఇసిరా
కోతలో

దుబ్బు తగిలి
నెత్తురొడిస్తే
అట్టాగే
నీళ్ళలో తడుపుదామని
కుంటలో కాలేస్తే
కసక్కన దిగిన
డిపార్టుమెంటు ముల్లు
కాపేస్తే పొద్దని
కాల్చినప్పుడు
అదిమితే
ఎటో లేసెళ్ళినయి పేణాలు
నీల్లపొంతలో
కాగిన నీల్లపొంతలో
నీల్లు తోడుకోని
గొందిలో రెండు సెంబులు
నీల్లు దొర్లిచ్చుకుంటే
ఏం కుట్టిందో ఏమో
ముల్లుగగ్రతో ముచ్చినగుంటలో
పొడిసినట్టయ్యింది
కొత్త ఏడిబువ్వలో
గొడ్డుగారం కలుపుకోని
ఒక ముద్ద
గొంతులో పడేసుకోని
మంచంలో కూలబడితే
మల్లీ మెలుకువొచ్చేసరికి
బతుకంటే
బండచాకిరనే
అన్న మాచజేజిమాట
గుర్తుకొచ్చింది.

# ఓనమాలు

నేను
సేదు పక్కెలు
పులక్కాలవ సొనల్లో
ఏరి ఏరి పట్టుకునేటప్పుడు
సింతాకు సిటారు కొమ్మకెళ్ళి కోసి
మునిపంట కొరికినప్పుడు -

మా యమ్మ
ఎండి మిరపగాయలు
కాల్సి కాల్సి పచ్చిపులుసు
బువ్వ కలిపి
పెట్టినప్పుడు -



మా అప్ప
కుండలో
గడ్డిమీద
కుడుములు
ఆయిగిల పెట్టి
నా నోట్లో కుక్కినప్పుడు -
ఎర్రపచ్చడితో
పొలం బువ్వకలిపి
మా యమ్మ
దోసిట్లో పెట్టినప్పుడు

మా అయ్య
పిల్లిమిసర గుత్తి తెచ్చి
బిళ్ళంగోడు ఆడే నన్ను
కేకేసి ఇచ్చినప్పుడు -

మాజేజి
తిరగల్లో
కందులు ఇసిరి
ముడిపప్పు
నానోట్లో పోసినప్పుడు
ఆకలికి అర్థం తెలియలేదు

నేను గవర్నమెంటు
హాస్టల్లో జేరి
పురుగులు తేలే బువ్వ
రుచీ పచీ లేని
పప్పుశారుతో
తింటనప్పుడు
కలిపి పెట్టటానికి
కడుపు కొట్టటానికి
మధ్యలోనే
'ఓనమాలు' వున్నాయని
మా హాస్టల్‌వార్డెన్
ఇంట్లో దొరికిన
నూనె డబ్బా చెప్పింది.



# అమ్మ

నిన్ను కనడానికి
మీ అమ్మ ఆకాశమంత అరుపు అరిచిందని
అల్లిమ్మత్త చెప్పింది
ప్రసవ వేదనలో ప్రపంచ ఆవిర్భావం
పుడమి బద్దలైతే విధ్వంసం
తల్లి పుడమిలో పునరుత్థానం
తల్లితో తూగలేక
భూమి దూది పింజయ్యింది
వీరుడైనా ధీరుడైనా అమరుడైనా అజేయుడైనా
అమ్మగన్న బిడ్డేనని
అమరవీర గాధల్లో

పల్లవి తనదేనని
క్రీస్తునుగన్న మరియమ్మ చెప్పింది.

అమ్మా!
చారిత్రక గమనంలో
గుంపునీవే, గణంనీవే, సంఘధర్మంనీవే
శిల్పమూనీవే, చిత్రలేఖనమూనీవే
చిరునవ్వూ నీవే, ప్రళయాగ్నీ నీవే
నువ్వు నవ్వితే భూమి పులకరిస్తుంది
నువ్వు కరిగితే సముద్రానివి
నువ్వు మండితే అగ్ని గోళానివి
నీవు భౌతికం
నీవు తాంత్రికం
నీ కాయం సృజనానికి మూలం
నీది ప్రవంతి
నీవు జీవధాతువు

అమ్మా !
మరణం నీదికాదు
నువ్వులేని అభివ్యక్తిది
నీవు లేకుండానే
ఉన్న దాన్నంతటినీ

సంఘర్షింప చేయగలవు
శిథిలమైందంతా నీలో శిల్పమవుతుంది
నీజోలపాటే

ప్రపంచ సాహిత్యానికి పల్లవి
నీవొక వాస్తవం
నీపై జరిగేదే కల్పన
నీదొక సంఘజీవనం
వైయుక్తికంతో నీకు వైరుధ్యం
నీవు ప్రవచించిన సమత్వాన్ని
భేదించిన పెత్తనమే సామ్రాజ్యతత్వం
దానిపై నువ్వు చీనాలో కేకవేస్తే
ఆఫ్రికా ఖండంలో నీలికొండలనుండి
నల్ల సూర్యోదయం
మానవుణ్ణి విభజించిన వర్ణతత్వం
నీకు జంధ్యాన్ని ధరింప జేయలేకపోయింది
నీవు ధరిస్తే ఆభరణమైన వర్ణం
ఆరుంధతీయంలో అంతరించింది
అందుకే, నిన్ను వెలివేద్దామంటే
నువ్వు నక్షత్రమాయ్యావు
నీ ఉగ్గులో ప్రంచం ఒదిగిపోయింది
తల్లి చెయ్యే పదార్థాన్ని భూమిగా మలచింది అని
తల్లి కరమైన ఎడారి అంతరంగం ఘోషించింది
తల్లి నిండిన ఉల్లమే ప్రబోధ పూర్ణమని
లుంబినీవనంలో
బుద్ధుని అరమోడ్చిన కన్నులు చెప్పాయి
పితృవాక్య పరిపాలనవల్ల

హింసకు ప్రతీక అయిన రామచరిత్ర
తల్లి హృదయం లేకే అరాచకమయ్యింది
తల్లంటే ఆకాశం, అమృతం, కవిత్వం
తల్లంటే తరంగం, ప్రవాహం
తల్లంటే ఎక్కుపెట్టిన విల్లు
తల్లంటే పండి ఒరిగినచేను
తల్లంటే జాషువా పద్యంలోని 'అరిపోని దివ్వె'

అమ్మా !
నువ్వు నిజంగా సమరానివి
నీబిడ్డగా
ఆసమరానికే పునరంకితం.



# లోకాయత ప్రచురణలు

కత్తి పద్మారావు గారి రచనలు

| | | | |
|---|---|---|---|
| 1. కులం పునాదులు | | (1981) | 20-00 |
| 2. జనగీతం | " | (1979) | 10-00 |
| 3. హేతువాద సత్యాలు | " | (1980) | 5-00 |
| 4. సాంఘిక విప్లవ రచయితలు | " | (1983) | 30-00 |
| 5. కులసంఘర్షణలు | " | (1983) | 5-00 |
| 6. women and Caste In India | " | (1983) | 5-00 |
| 7. జైలుగంటలు | " | (1986) | 10-00 |
| 8. దేశంద్డైరి | " | (1987) | 20-00 |
| 9. సాంఘిక విప్లవ మూర్తి డా॥ బి. ఆర్. అంబేడ్కర్ | " | (1990) | 20-00 |
| 10. రిజర్వేషన్లు - హిందూమతోన్మాదం | " | (1991) | 8-00 |
| 11. Social and Philosophical Movements In India | " | (1991) | 5-00 |
| 12. Dalit women | " | (1991) | 5-00 |
| 13. దళితుల చరిత్ర | " | (1991) | 10-00 |
| 14. చార్వాక దర్శనం | " | (1991) | 25-00 |
| 15. విముక్తిగీతం | " | (1987) | 5-00 |
| 16. రక్తక్షేత్రం | " | (1992) | 5-00 |
| 17. భారతీయ సంస్కృతిలో స్త్రీ | " | (1993) | 60-00 |
| 18. కులం - ప్రత్యామ్నాయ సంస్కృతి | " | (1993) | 20-00 |
| 19. దళిత సాహిత్యవాదం - జాషువా | " | (1995) | 15-00 |
| 20. Dr. B.R. Ambedkar the Visionary | " | | 5-00 |
| 21. Caste and alternative Culture | " | | 100-00 |
| 22. ప్రత్యామ్నాయ సంస్కృతి లో పెరియార్ మేళా | " | (1995) | 8-00 |
| 23. జాషువా సామాజికతత్వం | " | (1995) | 3-00 |
| 24. నల్లకలువ | " | (1996) | 20-00 |

✳

| | | | |
|---|---|---|---|
| 25. అంబేడ్కర్ సిద్ధాంత భూమిక | - కోట ప్రసన్న | | 8-00 |
| 26. రచ్చబండ | - మద్దూరి నాగేష్‌బాబు | (1996) | 15-00 |
| 27. దళిత కిరణాలు | - కలేకూరి ప్రసాద్ | (1996) | 7-00 |